REGD. No. RNL 18 ESTD: 1930 29-6-1990 శుక్రవారం రు. 1-50 లు

# జమీన్ రైతు



సంపుటి: 61 సంచిక 26 స్థాపకులు: నెల్లూరు వెంకట రామానాయుడుగారు * మేనేజింగ్ ఎడిటర్: నెల్లూరు శ్రీరామమూర్తి సంపాదకుడు: నెల్లూరు తోలేంద్రప్రసాద్

# ఎందుకోసమీ సిఎం డ్రామా?



ఉట్టికెక్కడానికి శక్తి చాలదు- స్వర్గానికి నిచ్చెనలు దేనికయ్యా శీనయ్యా!

శ్రీనివాసులురెడ్డి గొప్ప రాజకీయ చతురుడు. తన రాజకీయ అస్తిత్వం కాపాడుకోవడానికి ఎప్పుడేంటు చాకచక్యంగా తెలిసినవారు. సిగ్గు బిడియం, ఆత్మాభిమానం వంటి విషయాలలో పెద్ద పట్టింపులు లేనివారు కాబట్టి. నాయకుల కాళ్ళు పట్టి ప్రాధేయపడటానికి, కాళ్ళు గుంజుకున్నందుకు పత్రికల్లో రాయడానికి ఏమాత్రం వెనుకాడరు. తిట్టిన నోటితోనే పొగడగలరు; పొగిడిన మనుషులా అదే వ్యక్తిని తిట్టగలరు. ఆయన రాజకీయాలెప్పుడూ విలక్షణంగా వుంటాయి.

**మా హైదరాబాదు ప్రత్యేక విలేఖరి**

చెన్నారెడ్డితో చేదాలి ప్రాయాలొచ్చి మంత్రిత్వం ఊడుతుందా, వుంటుందా అన్న సందేహంలో పడిన తరుణంలో తన విలక్షణ రాజకీయ ఎత్తుగడల నైపుణ్యాన్ని మరొకసారి ప్రదర్శిస్తున్నారు. అమెరికా ఆస్పత్రిలో చెన్నారెడ్డి ఆరోగ్య పరిస్థితిపై డైలీ బులెటిన్లు విడుదలచేస్తూ, ముఖ్యమంత్రిని మార్చివేసుకోవడానికి శత విధాలా ప్రయత్నిస్తుండిన శ్రీనివాసులురెడ్డి, మొన్నొకరోజు ఉన్నట్లుండి పత్రికల వారిని పిల్చి- తాను ముఖ్యమంత్రిత్వానికి పోటీచేయబోతున్నానని ప్రకటించారు. హఠాత్తుగా ఆయన తమనుపిల్చి, ఈ ప్రకటన చేయడం పత్రికలవారికి కూడా మింగుడు పడలేదు

''చెన్నారెడ్డికి పిచ్చి ఉమార్చారు; నేను వైద్య ఆరోగ్యమంత్రిగా డాక్టర్లను పిల్చి మాట్లాడాను; పిచ్చి మనస్సు ఆగిన వ్యక్తి సాధారణ జీవితం గడపడం దుర్లభం; ఆయన పరిపాలనకిక పనికిరారు; అందువల్ల ముఖ్యమంత్రిగా చెన్నారెడ్డి తొలగింపు ఖాయం; కొత్త ముఖ్యమంత్రిపదవికి నేను పోటీచేస్తాను''- అని చెప్పారాయన. ఆ మరుసటిరోజు కూడా ఈ ప్రకటనను ధృవపరిచారు.

శ్రీనివాసులురెడ్డి ఇంత ఘనంగా ప్రకటించుకున్నప్పటికీ, పత్రికలు తాటికాయంత అక్షరాలతో ప్రచురించినప్పటికీ హైదరాబాదు రాజకీయ వాదులెవరూ దాన్ని సీరియస్‌గా తీసుకోలేదు. అమెరికాకు ఫోను చేసి డాక్టర్ చెన్నారెడ్డికి ఈ విషయం చెప్తే ఆయన పెద్దగా నవ్వారట. ఢిల్లీ నాయకులు సైతం దీన్ని జోకుగా పరిగణిస్తున్నారు

అయితే శ్రీనివాసులురెడ్డిమాత్రం అంత తేలికగా లేరు. ఎమ్మెల్యేలందరికీ ఫోను చేసి జరగబోయే నాయకత్వ ఎన్నికలో తనను సమర్థించమని ప్రాధేయపడుతున్నారు. మీరు నాదగ్గరకు రాలేకుంటే నేనే మీ దగ్గరకు వస్తానని చెప్తున్నారు. మంత్రులకు సైతం ఇదే ధోరణిలో ఫోన్లు చేస్తున్నారు. ఎమ్మెల్యేలు వీటన్నింటినీ ప్రేలాపనల క్రింద పరిగణించి నవ్వుకొంటున్నారు.

ఇంతకూ శ్రీనివాసులురెడ్డి ఇంత హఠాత్తుగా ఈ ఎత్తు ఎత్తడానికి కారణమేమి? ఆయన వెనుక ఎవరున్నారు? అన్నవి ప్రశ్నలు. చెన్నారెడ్డి అమెరికా నుంచి తిరిగిరాగానే తనను మంత్రిత్వంనుంచి తీసివేయడం ఖాయం కాబట్టి, ఈలోగా కొంత సంచలనం చేస్తే ఆ ప్రమాదం తప్పుతుందని భావించారా? లేక చెన్నారెడ్డి తర్వాత రాబోయే ముఖ్యమంత్రి తనను మంత్రివర్గంలోకి తప్పనిసరిగా తీసుకోవలసిన పరిస్థితులు కల్పించడానికి ప్రయత్నిస్తున్నారా? లేక జనార్దనరెడ్డిని ముఖ్యమంత్రిని కానివ్వకుండా చేయడానికి ఈ పాచిక విసురుతున్నారా? ఈ మూడింట్లో ఏదోఒకటి నిజమై వుండవచ్చు

## సిఎంనౌతానని అధికారులను దబాయించి కోట్లలో నిధులు దండుతున్నారు

*

## ఎమ్మెల్యేలు మాత్రం ఫక్కున నవ్వుతున్నారు!

ఆలోచన ఏదైనా కావచ్చుండి- ఈ ప్రకటన తర్వాత శ్రీనివాసులురెడ్డి పెద్ద మొత్తంలో నిధుల సేకరణకు పూనుకున్నారు. ఢిల్లీలో మాటలివ్వనిదే ఏ పనులూ జరగవు కాబట్టి, తాను ముఖ్యమంత్రి కావాలంటే ఏడు కోట్ల రూపాయలవసరమౌతాయని, అందువల్ల 4 తేదిలోగా డబ్బు తెచ్చివ్వాలని ఆయన ఇంజనీర్లు, డి ఎం అండ్ హెచ్ ఓ లు, డాక్టర్లకు ఫోన్లుచేసి చెప్తున్నారట. సి ఇ లు 25 లక్షలు, ఎస్ ఇ లు 10 లక్షలు, ఇ ఇ లు 8 లక్షలు, డి ఎం అండ్ హెచ్ ఓ లు 2 లక్షలు, డాక్టర్లు లక్ష లెక్కన ఇవ్వాలని స్వయంగా ఫోన్లుచేసి అడుగుతున్నారట ''మీ భవిష్యత్ కోసం చెప్తున్నాను. కాబోయే ముఖ్యమంత్రిని నేనే, రాజీవ్‌గాంధీతో స్వయంగా మాట్లాడాను, అయినా డబ్బులేనిదే పనిజరగదు, మీ కోటా ప్రకారం తెచ్చి ఇవ్వండి. భవిష్యత్‌లో మీ అవసరాలు నేను తీరుస్తాను'' అని అధికారులకు హితవు చెప్తున్నారట. ఇప్పటికే దాదాపు రెండు కోట్ల రూపాయలవరకు సేకరించారని వినికిడి. ఆయన ముఖ్యమంత్రి పోటీకంటే- ఈ దండుడు రాజధానిలో కలవరం సృష్టిస్తున్నది. అమెరికాకు ఫోనుచేసి చెన్నారెడ్డికి కూడా ఈ విషయం తెల్పారు. ఆయన [illegible]

పంపి, జాగ్రత్తగా వుండమని హెచ్చరించారట

అసలు శ్రీనివాసులరెడ్డికి ముఖ్యమంత్రి కావాలన్న ఆలోచన గాని, ఆశ గాని లేవని; చెన్నారెడ్డి తనను ఉద్వాసన పలికేలోగా కళ్ళు తక్కువపెట్టుకోవటానికే ఈ ఎత్తు ఎత్తారని కొందరు చెప్తున్నారు.

దివాకరరెడ్డి వంటివారికి ఈ పరిణామాలు సంకటంగా పరిణమించాయి. బంధుత్వరీత్యా ఆయన శ్రీనివాసులురెడ్డితో తెగతెంపులు చేసుకోలేరు; కలిసి పనిచేసి చెన్నారెడ్డికి విరోధి కాలేరు. రెండింటి మధ్య నలిగిపోతున్న ఆక్రోశంలో- నేదురుమల్లి జనార్దనరెడ్డి కుముద్‌బెన్ జోషి చేత ఫోను చేయించి, తన మామను రెచ్చగొట్టారని చెప్తున్నారట. ఆయన దృష్టికి తనమామ నోట్లో వేలుపెడితే కొరకలేని అమాయకుడుగా కన్పిస్తున్నాడేమో మరి!

ఈ విషయంలో కుముద్‌బెన్‌జోషి పేరు అక్కడక్కడా విన్పిస్తున్నప్పటికీ, తనను వ్యతిరేకించిన వ్యక్తిని ముఖ్యమంత్రిని చేయడానికి ఆమె సిద్ధపడుతుందని ఎవరూ భావించడంలేదు. ఢిల్లీ లాబీలో శ్రీనివాసులురెడ్డిని సమర్థించే నాయకుడు మరొకడు కన్పించడంలేదు.

ఇదిట్లా వుంటే, అసలీ సమయంలో ముఖ్యమంత్రి మార్పు అనేది వుండదని పరిశీలకులు అభిప్రాయ పడుతున్నారు. సంగీత వెంకటరెడ్డి వంటి మంత్రులు ఢిల్లీలో మకాం పెట్టినా, అనస్మృతి తోడు ఆస్తిగానేవున్నా చెన్నారెడ్డిని తొలగించే ఆలోచన రాజీవ్‌గాంధీకి లేనేలేదని ఢిల్లీ

—తరువ 12 వ పేజీలో

## జమీన్ రైతు

# వెనుకటి గుణం...

కనకపు సింహాసనంపై కూర్చున్నంతమాత్రాన వెనుకటి గుణం మారదని మన పెద్దలెప్పుడో కనిపెట్టారు. ఆంధ్రరాష్ట్రంలో కాంగ్రెస్‌వాదుల చేష్టలను ఊహించే అవారు వారీ లోకోక్తి కనిపెట్టి వుంటారేమో.

ఏడేళ్ళపాటు అధికార పీఠానికి దూరంగా వుండిన కాంగ్రెస్‌వాదులు, ప్రజల క్షమాగుణం ధర్మమా అని తిరిగి సింహాసనమధిష్ఠించగానే - వెనుకటి పాడుబుద్ధులన్నీ బయటపెట్టుకుంటున్నారు. ఏడేళ్ళకాదు, ఏడు జన్మలెత్తినా తమ వైఖరి మారనేమారదని చాటి చెప్తున్నారు; చేసిన తప్పులు క్షమించిన ప్రజలను చెప్పుతో కొట్టినంత పని చేస్తున్నారు.

నిండా ఆరునెలలు కాలేదు ఎన్నికలు జరిగి, అధికారం స్వీకరించి; రాష్ట్రంలో అప్పుడే నాయకులు కుమ్ములాటలు మొదలుపెట్టేశారు; అసమ్మతి కుంపటి వెలిగించారు; చెన్నారెడ్డిగారి కాళ్ళు రెండూ పట్టి క్రిందకులాగి, ఆ కుర్చీలో తాము కూర్చోవాలని కలలు కంటున్నారు; అమెరికా ఆస్పత్రిలో మంచంపై వున్న ఆయన్ను అట్నుంచి అటే ఇంటికి సాగనంపాలని కుట్రలు పన్నుతున్నారు.

'అధికారంకోసం కాంగ్రెస్ నాయకులు పడుతున్న ఈ పాట్లు చూస్తుంటే, రోత కల్గుతున్నది; చీకొట్టాలనిపిస్తున్నది. ఏడేళ్ళనాడు కాంగ్రెస్ ప్రజల ఛీత్కారానికి గురికావడానికి కారణం ప్రధానంగా ఈ అసమ్మతి లుకలుకలే. ఆరునెలలకొక ముఖ్యమంత్రిని మార్చి, మంత్రివర్గ విస్తరణనొక ప్రహసనం చేసి, పరిపాలనకు అవినీతి కంపు పట్టించి, ప్రజలలో ఏహ్యభావం జనింపజేసి, ఎన్నికలలో డిపాజిట్ కూడా తెచ్చుకోలేనంత హీనస్థితిలో ఇక్కడ పోయారు. అనాటి తప్పులకు ప్రజలు కాంగ్రెస్‌వాదులను ఒకసారికాదు-వరుసగా నాలుగు ఎన్నికలలో దండించారు.

అంత కఠినశిక్షకు గురైనా వీరిలో అణుమాత్రం మార్పు రాకపోవడం విచిత్రంగా వుంది; విచారం కల్గిస్తున్నది. చెన్నారెడ్డిపై మొదటిరోజునుంచీ అసంతృప్తి వుంది అధికారంలో లేనంతకాలం తెలుగుదేశం పార్టీ చేత పీపులు పగులకొట్టించుకొని పార్టీ పునరుజ్జీవనానికి కృషిచేసిన వారిని వదలిపెట్టి, అఖరుదశలో పార్టీలో చేరినవారిని అందలమెక్కించారన్న అసంతృప్తి కాంగ్రెస్ కార్యకర్తలలో సైతం ప్రబలంగా వుంది. అంతమాత్రాన ఆరునెలల్లో ఆయన కాళ్ళ క్రింద గోతులు త్రవ్వడం సమంజసమా? అందులోనూ అనారోగ్యం పాలై అమెరికా ఆస్పత్రిలో చికిత్స పొందుతున్న వ్యక్తిని, దేశానికి తిరిగి రాకముందే పీకిపారేయాలని కుట్రలు పన్నడం మానవత్వమనిపించుకుంటుందా?

పార్టీకిగాని, ప్రభుత్వానికిగాని ఒక ముఖ్యమంత్రి ఆరునెలల్లో ఏమిచేయగలడు? ఎవరి తప్పిదంవల్ల చెన్నారెడ్డి పదవి స్వీకరించినా ఆయన్ను మరికొంతకాలం అద్నే కొనసాగించడం ధర్మం. కనీసం ఆరోగ్యవంతుడై ఇంటికి తిరిగి వచ్చేవరకైనా ఆగడం మానవత్వం. అధికారదాహంతో అంతమాత్రంకూడా ఆగలేని కాంగ్రెస్ వాదులను ప్రజలు ఎట్లా చూడాలి? ఏమని భావించాలి? తాము పొరపాటుచేశామని, చెప్పుతోరికే వారిచేత చెరకు తిప్పించాలని చూశామని ప్రజలు బాధపడవలసిన, పశ్చాత్తాప పడవలసిన పరిస్థితి కల్పిస్తున్నారు- కాంగ్రెస్ నాయకులు.

రాష్ట్రనాయకుల ఈ రోతవైఖరిని అధిష్టానవర్గం సహించడం శోచనీయం. ముఖ్యమంత్రుల మార్పుతో ఒకపెద్ద రాష్ట్రాన్ని కోల్పోయిన చేదు అనుభవం వారికికూడా గుణపాఠం నేర్పినట్లులేదు. అదే జరిగివుంటే-అసమ్మతి పేరుతో కట్టలుకట్టలుగా ఢిల్లీకి తరలివస్తున్న రాష్ట్రనాయకులను పొలిమేరల నుంచే తరిమివేసి వుండేవారు; బుద్ధి చెప్పి వెనక్కు పంపివుండేవారు తప్ప సాదరంగా అహ్వానించి. చెప్పే చెప్పుడుమాటలకు చెవి అప్పగించి వుండేవారుకారు.

ఏది ఏమైనా, రాష్ట్ర కాంగ్రెస్‌వాదుల ప్రవర్తన జుగుప్సాకరంగా వుంది. పదవులకోసం కుక్కలంటె కొట్లాడుకునే స్థితికి దిగజారిన వీరిని క్షమించడం, నాయకులుగా గుర్తించి గౌరవించడం పాపంచేసినట్లవుతుంది! రాజీవ్‌గాంధీ ఈ విషయం గ్రహించి ఇప్పటికైనా తన పొరపాటును సరిదిద్దుకోవాలి. తన శిష్యగణాన్ని మందలించి, అసమ్మతి కార్యకలాపాలకు బహిరంగపదవుల పోటీ ప్రకటనలకు స్వస్తి చెప్పించాలి

## జమీన్ రైతు

28-6-1940

16 పేజీలు అణా

### నెల్లూరు ముచ్చట్లు

విమర్శకుడు

మున్సిపల్ ఎలక్షన్

బహుశా ఈ నె వత్సరం ఈ ఎన్నికలు వస్తవో రావో: కాని అప్పుడే హంగామా జరుగుతున్నట్లు ధ్వనులు మాత్రం వినిపిస్తున్నవి కాని కాంగ్రెసు యీ సంవత్సరం మునిసిపల్ ఎన్నికల్లో దిగాలెనా? అక్కరలేదా? అనేది ముందుగా తేల్చడం మంచిది. సన్నదిగితే దీ తు లు ముదుచుకొని కూర్చుంటూ; కాంగ్రెసు పేరుతో ఏమిజేసి ఏడ్చినాము కాబట్టి తిరుగా ప్రజలవద్దకుపోయి ఓటివ్వమని అడుగుదాము?

జిల్లాబోర్డు-మున్సిపాలిటీలు ఏమన్నా ప్రోగ్రామిచ్చి చేయిస్తేగదా? పినిసివారు.

ప్రకాశంపంతులూ! తన హయాంలోనన్నా యీ విషయం తేల్చకుంటే జస్టిసుమోహమెత్తుకోని ఓటర్ల ముందుకు మేం పోలేమయ్యా!

వి. సి. రెడ్డికి లేదీ మాత్రం-అన్న దేవులరెడ్డి నిలుస్తాడని, పోటీ చేస్తాడని తెలుస్తోంది అబ్బ! మురలికంపు అంటుందేమో మునిసిపల్ కక్ష.

#### 12 సేర్ల కుంచం

12 సేర్ల కుంచంతో రైతుల ధాన్యం కొలుస్తున్నారని ఎవరో ఒక వ్యాపారస్తుడు కలెక్టరు నోటీసుకు తెచ్చాడట. పిచ్చ ముండ-తో కాల్చేది కూలీలకు జీతగాండ్లకుగాని వ్యాపారస్తులకుగాదు.

### 50 ఏళ్ల క్రితం ఈ వారం

ఇంకా 14 సేర్ల కుంచానికిబదులు 14½ 16 సేర్ల కుంచంతో వర్తకులు రైతుల్ని దగాజేస్తున్నారని కలెక్టరు వారి నోటీసుకుతెస్తే మెరుగు.

#### మా శర్మ పెళ్ళి

మన టి వి యస్ శర్మగారికి యీ ఆర్య పె ళ్లి జరిగింది నెల్లూరులో. ఈ పెళ్లికి సుప్రసిద్ధ ఫిలిం దర్శకుడు వై వి రావు మున్నగు పెద్దలొచ్చారు.

మన యీ శర్మ ఎవరో అసలు తెలుసా? 1914 యుద్ధంలో బోలాకోరీ తింటున్న హిట్లరు మహాశయునిమాదిరి శ్రీరాం ఫిలింకంపెనీకము దిర నెల్లూరు బజార్లో అటూఇటూ కోలీ తిటూన్న ఒక అగ్రవాసుడు

అప్పుడో పిల్లవాడి గ్రామాడు గాకపోయినా పేడు పత్రికల్లో అంతటి ఉన్నత పదవిస్తు కిలారా వెన్నెళ్ళారు ఫిలింరంగంలో అట్టి శర్మ ఈనాడు పెళ్లి చేసుకున్నాడంటే ఇతోధిక ఆయురారోగ్య ఐశ్వర్యాభివృద్ధి గలుగునట్లు దీవించడం మా విధిగదా! సినిమా ప్రశ్నల్లో పోటీచేసిగెలవండి!!

బహుమతి 000000 లు

అషారఫూతి కాంపిటేషన్ నెం 1 లు కూపను

ప్రశ్నలు:

1. పత్రికల్లో ప్రకటనలు జేసి దబ్బు వసూలుకుండా ఎగబెట్టిన ఫిలిం కంపెనీ లేవి? వాటిలో ప్రథమ స్థానం ఎవ్వరిది?

2. ప్రకటన దబ్బును అసలుదారు వద్ద తీసుకొని మధ్యలో కైంకర్యం జేసిన పబ్లిసిటీ ఆఫీసర్లెవరు?

3. ఏమీచేతగాకుండా తగుదునంటూ వచ్చి ఫిలిములు డైరెక్టుజేసి రంగవర్ణ తెలుగు దర్శకులెవ్వరు?

4. ఆర్టిస్టులకు సరిగా తిండిబెట్టక, జీతమివ్వక జల్లాడించిన ఫిలిం కంపెనీ లేవి?

దరఖాస్తులకు ఆఖరుతేదీ 32-6-4 (బల్లలు జనవాటి కో పకటి దలకను

అడ్రసు. అషారఫూతి కాంపిటీషన్, స్మశాన బిల్డింగ్స్, కలియుగం S. India.

# దేవీలాల్ జిందాబాద్!

భారతదేశంలో ఎట్టకేలకు రైతు సమస్యలపై మనసుపెట్టి పనిచేసే నాయకుడొకడు ఉన్నట్లేదాడు. రంజైనటి తుదుపు వ్రసంగాలు కాకుండా, రైతులకు నిజంగా ఏదో ఉపకారం చేయాలన్న తలంపు కల్గిన ప్రభుత్వాధినేత దొరికాడు.

దేవీలాల్ రాజకీయాలు ఎటువంటివైనా కానివ్వండి; వి. పి సింగ్ ప్రభుత్వాన్ని అయన తన స్వార్థపరత్వంతో ఎన్నిదెబ్బల సిక్కులైనా త్రాగించనివ్వండి; బంధుప్రీతి, ఆశ్రితపక్షపాతం, కుమారులపై అపరిమితమైన ప్రేమ వ టి దుర్లక్షణాలు కల్గిన రాజకీయవాది అయితే కానివ్వండి; ఇంగ్లీషు మాట్లాడ దం చేతకానివాడిగా "కల్లదొరల" ఎగతాళికి గురైన నాయకుడైతే కానివ్వండి; అ య న గతచరిత్ర ఎటువంటిదైనా కానివ్వండి. రైతు సమస్యల పట్ల, రైతు సంక్షేమంపట్ల దేవీలాల్ చూపుతున్నంతమాత్రం శ్రద్ధ ఈ నలభై ఏళ్ళలో ఏ నాయకుడూ రూపొందించలేదన్నది వాస్తవం. దేశ ఉప ప్రధాని సీట్లో కూర్చుని, నేను 'రైతుబిడ్డ' నని సగర్వంగా ప్రకటించడమే గాక, నగరాలనుంచి వచ్చిన అధికారుల అభ్యంతరాలను ఒక్క హుంకరింపుతో ప్రక్కకునెట్టి, రైతు సంక్షేమ పథకాలు ప్రకటించిన నాయకుడూ ఇదివరకెన్నడూ లేడనడం నిజం.

పదివేల రూపాయల లోపు రుణాల రద్దుకు డైరక్టుగా ప్రకటించింది దేవీలాల్. రిజర్వుబ్యాంకు, ఫైనాన్సు మంత్రిత్వశాఖలు ఎన్ని అటంకాలు పెట్టినా వి పి సింగ్ మెకలు వంచి దాన్ని అమలులోకి తెస్తున్నది దేవీలాలే! ధాన్యం మద్దతు ధరను ఏ ప్రభుత్వమూ సాహసించనంత పెద్ద మొత్తంలో పెంచింది దేవీలాల్; రైతులకు అన్యాయం జరిగితే పట్టణాలకు పాలు, బియ్యం పంపడం నిలిపివేయమని నిర్భయంగా గ్రామీణులకు సలహా ఇచ్చింది దేవీలాలే!

ఢిల్లీ నగరపు అధికార పీఠాధిపతులకు రైతు అనే వాడు ఒకడున్నాడని, వాడి సమస్యలు తీర్చడం ప్రభుత్వం కర్తవ్యమని గుర్తుచేసి, చలిచితెచ్చిన దేవీలాల్‌కు ప్రతి భారతీయ రైతు జిందాబాద్ కొట్టాలి. ధాన్యం మద్దతు ధరను పెంచడం అసాధ్యమని ఇంతకాలం ప్రజలను మభ్యపెట్టిన గత ప్రభుత్వాలను, నాయకులను రైతులు నిలదీసి సంజాయిషీ కోరాలి. ఇప్పుడు సాధ్యమైంది అప్పుడెట్లా సాధ్యంకాకుండా పోయిందో వారిచేత సమాధానం చెప్పించాలి.

## జనవాణి

నెల్లూరు — డి ఆర్. రెడ్డి.

### ఇరుకైపోయిన సూళ్లూరుపేట స్మశానం

సూళ్ళూరుపేట స్మశానం మరీ ఇరుకైపోయింది. ఒకప్పుడది చాలా విశాలంగా వుండేది. కానీ రైల్వే వారు రోడ్డు కాలంగి పొడ్ల కట్టడం నిర్మాణంతో నాలుగింట మూడు వంతుల స్థలం పోయింది. ఇంకొక ప్రక్క పంచాయతీ సిబ్బంది, ట్రాక్టర్ల కొద్దీ చెత్త, చెదారం తెచ్చి ఇందులో పోస్తున్నారు. కుళ్ళిన చెత్త కుప్పలవల్ల స్మశానంలోకి అడుగుపెడితే ముక్కులు పగిలిపోతున్నాయి. శవాలను తీసుకపోయేవారు ముక్కులు గట్టిగా మూసుకొని, ఊపిరి బిగపట్టి, మృత్యువీద నిలబడినట్లు, హడావుడిగా శవదహన సంస్కారం పూర్తిచేసి పరుగులు పెట్టవలసి వస్తున్నది.

పంచాయతీ అధికారులు తక్షణం స్మశానంలో చెత్త చెదారం తొలగించి, పొరుం సమస్య తీర్చాలని మనవి.

సూళ్ళూరుపేట — కె. సుబ్రహ్మణ్యం

★

# KORA

## Institute of Engineering & Medical Entrance Coaching

### TEKKEMITTA - NELLORE-524 003

**Once Again we have Proved ourselves As No. 1 in the State in the 1990 EAMCET Results.**

**We congratulate the following Top Rankers who kept our Flag at greater heights of Glory.**

## ENGINEERING

| | | | |
|---|---|---|---|
| 1 | N. H. Arifunissa | 27489 | 14 |
| 2 | S. Anil kumar | 43510 | 69 |
| 3 | V. Ramesh | 48515 | 67 |
| 4 | K. Kalyan Chakravarthy | 61488 | 71 |
| 5 | V. Venkata Ram | 39382 | 88 |
| 6 | D. Dilip kumar | 44466 | 90 |
| 7 | P. V. Sunil kumar | 35303 | 91 |
| 8 | D. K. Krishna | 43791 | 103 |
| 9 | V. V. Suresh | 46476 | 124 |
| 10 | G. Venkata Ramababu | 27967 | 135 |
| 11 | M. Chandra Sekhar | 35273 | 148 |
| 12 | K. P. P. Kalyan Chakravarthy | 38293 | 148 |
| 13 | P. Vamsi Krishna | 13607 | 152 |
| 14 | G. Naveen kumar | 21501 | 157 |
| 15 | K. Satish kumar Reddy | 43566 | 174 |
| 16 | R. Balaji Babu | 27136 | 176 |
| 17 | K. Suresh | 39293 | 184 |
| 18 | P. Sridevi | 33992 | 203 |
| 19 | Y. Srinath Reddy | 35999 | 211 |
| 20 | C. Bharathi | 27241 | 219 |
| 21 | K. V. Siva kumar | 41365 | 225 |
| 22 | P. Surendra | 38916 | 235 |
| 23 | P. Gopi chand | 44504 | 235 |
| 24 | T. Bhaskar Reddy | 44875 | 243 |
| 25 | M. Satish | 38950 | 261 |
| 26 | S. B. Kalyan Chakravarthy | 48163 | 267 |
| 27 | D. S. R. S. Srinivas | 43035 | 276 |
| 28 | B. Sridhar | 27329 | 292 |
| 29 | V. Venkateswarulu | 39807 | 299 |
| 30 | M. Naga Sailaja | 30037 | 302 |
| 31 | S. Ramesh kumar | 38345 | 310 |
| 32 | P. Rama Rao | 48606 | 312 |
| 33 | D. Mahesh Raj Narayan | 27695 | 333 |
| 34 | P. Narapa Reddy | 45657 | 336 |
| 35 | Ch. Srinivas | 33639 | 356 |
| 36 | D. Sai Bhaskar | 39366 | 369 |
| 37 | D. Mohamed Khasim | 27295 | 384 |
| 38 | M. Rama Krishna Rao | 66368 | 387 |
| 39 | B. Damodar Reddy | 44064 | 396 |
| 40 | P. Nageswara Rao | 38467 | 409 |
| 41 | B. Sampath Reddy | 45677 | 413 |
| 42 | K. Ramesh | 44097 | 421 |
| 43 | Ch. Papa Rao | 45337 | 441 |
| 44 | P. Pavankumar | 43466 | 451 |
| 45 | M. V. Suresh kumar | 34649 | 452 |
| 46 | Sk. Jawahar Jahangir | 37447 | 455 |
| 47 | R. Yassam Shariat | 44776 | 465 |
| 48 | Ch. Srinivas | 58922 | 472 |
| 49 | P. Phanikumar | 43819 | 477 |
| 50 | K. Venumadhav | 45574 | 509 |
| 51 | P.V.P. Sunil Kumar | 29772 | 565 |
| 52 | P. Vinaykumar | 44138 | 574 |
| 53 | K. Srinivasulu | 48619 | 578 |
| 54 | V. Kalyana Chakravarthy | 43664 | 586 |
| 55 | P. Srinivasa Rao | 36132 | 587 |
| 56 | B.S. Deepak | 43930 | 595 |
| 57 | A. Chandra Sekhar | 42642 | 612 |
| 58 | P. Balasubramanyam | 30435 | 617 |
| 59 | P. Kishore-kumar Reddy | 39002 | 638 |
| 60 | T. Muralimaheswara Reddy | 38936 | 649 |
| 61 | B. Nanda kumar | 18395 | 661 |
| 62 | M. Rajasekhar Rao | 37867 | 690 |
| 63 | M. Vishnu-vardan Reddy | 35531 | 692 |
| 64 | G. Jayalakshmi | 38696 | 743 |
| 65 | G. Syamsundar Reddy | 27742 | 753 |
| 66 | T. Krishna Mohan Reddy | 39272 | 753 |
| 67 | K. Murali Krishna | 39747 | 763 |
| 68 | K. Srinivas | 39679 | 771 |
| 69 | J. Sucharitha | 13031 | 773 |
| 70 | M. Rajendra Simha Varma | 43593 | 790 |
| 71 | P. Sudheer | 36149 | 792 |
| 72 | N. Babji | 53092 | 798 |
| 73 | Y. Srinivasulu Reddy | 44888 | 804 |
| 74 | Y. Chandra Mohan Reddy | 27070 | 807 |
| 75 | M. Chetana | 47621 | 850 |
| 76 | J. C. Krishnakanth | 47649 | 866 |
| 77 | K. Nagavardhana Reddy | 39404 | 877 |
| 78 | A. V. S. Sastry | 23822 | 891 |
| 79 | C. Madhava | 38464 | 905 |
| 80 | M. Sri Nagesh Babu | 52696 | 944 |
| 81 | T. Sankara Naryana | 45575 | 946 |
| 82 | V. Rushendra Kumari | 61426 | 955 |
| 83 | B. Raghurami Reddy | 45439 | 968 |
| 84 | M. Sridhar Babu | 38217 | 969 |
| 85 | Ch. M. N. Giri Prasad | 51082 | 984 |
| 86 | D. Srinivasa Rao | 38600 | 1013 |
| 87 | V. V. Suresh kumar | 38240 | 1036 |
| 88 | P. Samar | 45324 | 1049 |
| 89 | M. Sivaram Prasad | 29887 | 1065 |
| 90 | J. Anand | 46634 | 1067 |
| 91 | V. S. L. Neelima | 21159 | 1081 |
| 92 | E. V. L. Prasad | 43478 | 1093 |
| 93 | P. Srinivasa Rao | 47731 | 1096 |
| 94 | M. V. S. S. Ravi kumar | 39744 | 1113 |
| 95 | V. Nirmala | 57595 | 1118 |
| 96 | N. Raja Sekhar | 35915 | 1124 |
| 97 | S. Suresh | 44089 | 1164 |
| 98 | N. Venkaiah | 43485 | 1183 |
| 99 | K. Kiran kumar | 27834 | 1210 |
| 100 | N. Rajeev | 51660 | 1212 |
| 101 | M. Sridhar Reddy | 45975 | 1228 |
| 102 | N. Pavan kumar | 43592 | 1242 |
| 103 | P. C. Narasimha Reddy | 39258 | 1248 |
| 104 | Y.S N. Kalyan Chakravarthy | 30267 | 1264 |
| 105 | N. Srikanth | 38753 | 1278 |
| 106 | J. Ravi kumar | 38904 | 1285 |
| 107 | V. Siva kumar | 50408 | 1333 |
| 108 | M. Padmapriya | 18612 | 1410 |
| 109 | B. V. L. Narsimha Prasad | 45929 | 1414 |
| 110 | M. Mahaboob Basha | 35186 | 1438 |
| 111 | K. V. Venugopal Rao | 48691 | 1447 |
| 112 | S. Khadurulla | 39808 | 1460 |
| 113 | K. Radha Rani | 54087 | 1482 |
| 114 | A. Rama babu | 39459 | 1488 |
| 115 | G. Baby Rani | 33198 | 1528 |
| 116 | J. Srinivasulu | 39127 | 1541 |
| 117 | A. Surya Narayana Sarma | 41927 | 1545 |
| 118 | T. Sravana kumar | 39715 | 1561 |
| 119 | U. Ravindra Mohan | 27638 | 1566 |
| 120 | C.V.R. Murthy | 45278 | 1574 |
| 121 | S. Srinivasa Goutham | 37674 | 1592 |
| 122 | P. Mahesh kumar | 38857 | 1615 |
| 123 | K. Balaji Reddy | 49626 | 1632 |
| 124 | R. Prasanthi | 39235 | 1668 |
| 125 | K. Ravindra Reddy | 57259 | 1692 |
| 126 | T. V. Rajya Lakshmi | 39471 | 1698 |
| 127 | A. Ravi kanth | 44588 | 1715 |
| 128 | S. V. Manjunath | 28159 | 1728 |
| 129 | M. Suresh | 39075 | 1822 |
| 130 | K. S. Phanidra | 43033 | 1831 |
| 131 | K. Kiranmayi | 37178 | 1831 |
| 132 | P. Veeranjanyulu | 38012 | 1837 |
| 133 | M. Subba Rayudu | 41977 | 1848 |
| 134 | M. Thirmula Raju | 43477 | 1863 |
| 135 | N. Victor Paul | 56128 | 1869 |
| 136 | S. Satish kumar | 32177 | 1871 |
| 137 | B. Soujanya | 45949 | 1875 |
| 138 | A. Padma | 41640 | 1890 |
| 139 | T. Dinakar | 45588 | 1993 |

## MEDICAL

| | | | |
|---|---|---|---|
| 1. | K. Srikanth | 15345 | 5 |
| 2. | R. Srikanth | 83989 | 17 |
| 3. | R. Satish Mohan Reddy | 85411 | 18 |
| 4. | A.K. Chakravarthy | 81322 | 20 |
| 5. | K. Satish | 86237 | 29 |
| 6. | C.V. Subba Reddy | 81372 | 30 |
| 7. | D. V. Nagarajan | 71247 | 37 |
| 8. | P. Srikanth Babu | 86577 | 38 |
| 9. | P. Srikanth Reddy | 83948 | 39 |
| 10. | P. Karuna | 85453 | 44 |
| 11. | B. Mamatha | 81007 | 52 |
| 12. | B.V. Raja Sekhar | 81003 | 62 |
| 13. | V. Dileep Kumar | 85063 | 65 |
| 14. | Y. Soumya | 86191 | 57 |
| 15. | A. Sarada Devi | 80642 | 58 |
| 16. | Ch. Sudhakar Rao | 85545 | 66 |
| 17. | K. Darwin | 81317 | 67 |
| 18. | G. Ravindra Varma | 70772 | 68 |
| 19. | M. Srikar Reddy | 74938 | 79 |
| 20. | G. Ravindra Reddy | 84299 | 80 |
| 21. | M. Surekha | 86433 | 83 |
| 22. | K. Vidya Sagar | 73199 | 85 |
| 23. | P. Vijaya Vasavi | 80627 | 88 |
| 24. | J. Ravi Varma | 86564 | 89 |
| 25. | D. Balaji Sasidhar Reddy | 84233 | 97 |
| 26. | S. V. Usha Rani | 89508 | 98 |
| 27. | C. K. Phani | 81289 | 101 |
| 28. | N. Anupama | 73118 | 103 |
| 29. | A. Bhaskar Ramesh | 82422 | 07 |
| 30. | K. Saroja | 858-7 | 109 |
| 31. | K. Gopi Krishna | 81275 | 116 |
| 32. | P. Maheswara Reddy | 74947 | 118 |
| 33. | Ch. Naga Jayanthi | 85475 | 124 |
| 34. | M. Indira | 90703 | 131 |
| 35. | V. N. V. Lakshmi | 77311 | 133 |
| 36. | K. Vikram | 85936 | 140 |
| 37. | M. Sirisha | 86033 | 160 |
| 38 | L. Sudersan Reddy | 85689 | 163 |
| 39. | A. Naga Sasi Bhushan Reddy | 84459 | 170 |
| 40. | M. Venu Gopal | 80937 | 172 |
| 41 | K. Kavitha Reddy | 62962 | 190 |
| 42. | C. Haritha | 85722 | 198 |
| 43. | T. Sreenivasa Reddy | 81160 | 201 |
| 44. | D. V. Sunil | 85735 | 202 |
| 45. | M. Lalitha Devi | 84956 | 215 |
| 46. | P. Vanaja | 85051 | 223 |
| 47. | A. Manjula | 81775 | 225 |
| 48. | D. Ravi | 80855 | 235 |
| 49 | Madhavi | 83821 | 240 |
| 50. | R. Rajesh | 86592 | 244 |
| 51. | P. Uma | 78986 | 249 |
| 52 | D. Prabhath Kumar | 83694 | 253 |
| 53. | D. V. S. Rambabu | 88006 | 253 |
| 54 | V. Srinath | 83606 | 256 |
| 55 | M. Mallikarjuna Reddy | 81202 | 263 |
| 56 | D. Sridhar Reddy | 85J01 | 275 |
| 57 | C. Kavitha | 84292 | 279 |
| 58 | Y. Aslthosh Prasad | 70758 | 279 |
| 59 | P. Ravi Kaladhar Reddy | 78217 | 283 |
| 60 | B. Vijayasanthi | 92649 | 288 |
| 61 | I. Srinivasa Guptha | 79932 | 290 |
| 62 | A. V. Subba Reddy | 86138 | 295 |
| 63 | T. Suryaprabha | 91188 | 302 |
| 64 | M. Hari Krishna | 85002 | 309 |
| 65 | G. Malleswari | 81315 | 311 |
| 66 | T. Venkateswara Rao | 85790 | 311 |
| 67 | G. Muralidhar | 86376 | 314 |
| 68 | B. Viswa Prakash | 82917 | 319 |
| 69 | Rajani | 864 7 | 322 |
| 70 | M. Sunitha | 86007 | 339 |
| 71 | J. Anil Kumar | 78833 | 344 |
| 72 | M. L. N. Parasad | 85243 | 348 |
| 73 | Jaya Bharathi | 85484 | 353 |
| 74 | E. Umakanth | 85576 | 355 |
| 75 | K. V. Srinivasa Babu | 90735 | 355 |
| 76 | C. AparnaReddy | 65741 | 364 |
| 77 | V. Sobha | 81287 | 377 |
| 78 | N. Ravi Venkat | 88525 | 380 |
| 79 | S. Venu Gopal Reddy | 75018 | 383 |
| 80 | K. V. Sridevi | 80479 | 400 |
| 81 | P. Praveen Kumar Reddy | 79244 | 402 |
| 82 | A. Anil kumar | 86583 | 410 |
| 83 | P. Sundari | 80662 | 416 |
| 84 | N. Chandra Kiran | 79058 | 420 |
| 85 | V. Aruna | 82147 | 424 |
| 86 | B. Sarada | 86905 | 445 |
| 87 | C. Uday kumar | 66538 | 457 |
| 88 | G. S. V. Raghunath | 86583 | 460 |
| 89 | G. Venkata Naga Lakshmi | 80653 | 461 |
| 90 | V. Hanath kumar | 88127 | 464 |
| 91 | K. Bhaskar Rao | 78741 | 490 |
| 92 | A. Madhu Subhan Reddy | 86870 | 494 |
| 93 | V. S. S. Rama Devi | 71395 | 502 |
| 94 | G. Siddeswara Prasad | 80935 | 503 |
| 95 | K. Sandhya | 80652 | 523 |
| 96 | R. Janaki Ram | 86343 | 533 |
| 97 | P. Vinuthana | 80629 | 536 |
| 98 | K. Rohini | 84627 | 543 |
| 99 | K. Sailaja Devi | 78444 | 554 |
| 100 | K. E. Vijaya Prasad | 79613 | 557 |
| 101 | G. Sudha | 86428 | 569 |
| 102 | S. J. Krishna | 80404 | 574 |
| 103 | M. Sailaja | 88158 | 579 |
| 104 | G. Vijaya Lakshmi | 85435 | 589 |
| 105 | N. Praneetha | 80011 | 599 |
| 106 | C. Mamatha | 81320 | 609 |
| 107 | Y. V. Rami Reddy | 86338 | 612 |
| 108 | T. Neeraja | 74818 | 622 |
| 109 | B. Manjula Vani | 81330 | 629 |
| 110 | V. S. Rajesh Khanna | 97180 | 631 |
| 111 | K. Ravi Krishna | 88294 | 642 |

This is exclusive of reservations. Nearly 40 Students in Medical and 60 Students in Engineering will get admission on reservation basis.

**For 1991 EAMCET longterm coaching send Rs. 20/- by M.O. or Cash payment (D.D. not accepted) for application form and Prospectus from 10th of July, 1990**

